# బాల వ్యాకరణం

## సంధి పరిచ్ఛేదం

### ద్రుతం వైవిధ్యం

ఉపన్యాసకుడు

డా.రామక పాండురంగ శర్మ

# ద్రుత సంధులు

1. ద్రుతం + పరుషాలు > సరళ, బిందు, సంశ్లేష, స్వత్వ
2. ద్రుతం + సరళాలు, స్థిరములు > లోపసంశ్లేషలు
3. ద్రుతం + వర్గ యుక్కులు, సరళాలు > పూర్ణ బిందువు
4. అవసానమందు > లోపం
5. ద్రుతం పై న కారం
6. ఖండ బిందు, లోపముల, సంశ్లేషల నిరాకరణ
7. ద్రుత లోపం
8. నుగాగమం

# ద్రుత లోపం

20. అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు.

వాఁడు వచ్చెన్ - వాఁడు వచ్చె - వాఁడు వచ్చెను.

ఈలోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితం బయియుండు. గుర్వవసాయి యగు పద్యంబు తుదను స్వత్వంబు లేదు.

అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్.

# న కారం

21. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. అదియును న్గాక - దివంబునుం బోలె.

--------------------------------

సర్వమున్+ అతని=సర్వమున్నతని,

అంటిని + ఇందరకు = అంటినిందరకు

# లోప, ఖండబిందు ల నిరాకరణ

22. అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి తొలి హ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు.

ముంగొంగు - క్రొంబసిఁడి - కన్దోయి.

# సంశ్లేషం - నిరాకరణ

23. తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

తాను + చదివె = తాఁజదివె, తాను జదివె

తాను + వినె తా వినె, తాను వినె.

దీర్ఘంబుమీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.

# ద్రుత లోపం

24. సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు.

ఎల్లయర్థములు, ఎల్లకలుషములు.

సర్వపర్యాయం బయిన యెల్లశబ్దంబు ద్రుతాంతం బయినయవ్యయంబు.

దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.

# ద్రుత వైవిధ్యం

1)అవసానమందు లోపం బహుళమ్ (వచ్చెను, వచ్చెన్, వచ్చె)

2)కొన్నిచోట్ల ద్రుతంపై నకారం (అదియును న్గాక)

3) తొలినుడి హ్రస్వంపై ఖండబిందువు, లోపం లేవు

4) తాను, నేను పదాల ద్రుతాలకు సంశ్లేష లేదు ( తాను జదివె, తాఁజదివె, నేను వింటి, నేఁ వింటి)

5) సమాసమందు ద్రుతానికి లోపం (ఎల్ల యర్థములు)

